అణా గ్రంథమాల ప్రచురణము: ౧౫

# మొగలాయి కథలు.

## ( రెండవభాగము )

గ్రంథకర్త:

శ్రీ సురవరము ప్రతాపరెడ్డి; బి. ఎ., బి. ఎల్.

ప్రకాశకులు:

అణా గ్రంథమాల






సోల్ ఏజెంట్లు:—

కేశవ పబ్లికేషన్సు అండ్ బుక్కుస్టాల్సు లిమిటెడ్

జాంబాగు, హైదరాబాదు - దక్కన్.

 1941 [ వెల ౧ అణా

# విషయ సూచిక


1. వేతాళ క్షేటీ ... ౧
2. రంభ ... ... ... ౧౫
3. చస్త్రామంత్రే పురుషతు లేదు ... ౨౧
4. ఫకీరు బిడ్డ ... ... ౨౫
5. రుమాలను భర్త తినిపోయినది. ... ౩౨


## ఆశా గ్రంథమాల

ఆశయములు:- ఆంధ్రులందు మాతృభాషాభిమానము కలిగించ, ఆంధ్రభాషా ప్రచారము గావించుటయు, తద్వార ఆంధ్రులందు ప్రపంచ జ్ఞానము కలించుటయు, ముఖ్యముగా ప్రతిఆంధ్రుడు కొని చదువు అవకాశము కలుగజేయుటకు సాధ్యమైనంత చౌకగా పుస్తకములను అందజేయుటయే మా ఆశయము.

మహనీయుల జీవితములు, ఆంధ్రుల నిత్యజీవితమునకు సంబంధించి పుస్తకములు ధార్మిక, సాంఘిక, కర్షక, కార్మిక మరియు రాజకీయసమస్యలపై అందరికి అర్థమగు భాషలో అతిసులభశైలిలో మీదు మిక్కిలి అందరికి అందుబాటులో నుండునట్లు ప్రచురింపబడును.

నియమములు:- మా గ్రంథమాలనుండి 100 పుస్తకములు 4 సంవత్సరములలో ప్రచురింపబడును. ప్రతిపుస్తకము సుమారు 40 పేజీలువుండును.

మా గ్రంథమాలకు చందాదారులు కాగోరువారు అందుకు లిఖితపూర్వకముగా ఒప్పుకొనవలయును. అట్టివారు సభ్యత్వము క్రింద 5-0-0 చెల్లించవలయును. టపాద్వారా తెప్పింప గోరువారు మరి 2-0-0 తపాలావ్యయముక్రింద చెల్లించవలయును మధ్యనచేరు సభ్యులకు వెలువడిన పుస్తకములు వున్నచో యివ్వబడును.

అప్పుడప్పుడు అనుబంధములు తెలుగు మరి యితరభాషలలో కూడ వెలువడును. వాటిని కొనవలయునను ప్రతిబంధకము సభ్యులకుండదు.

మేము కోరగానే యీ పుస్తకము "బెంగాలీ కథలు (రెండవ భాగము)" దయతో అనుగ్రహించిన శ్రీసురవరం ప్రతాపరెడ్డి బి.ఏ. బి.ఎల్. గారికి కృతజ్ఞతావందనము అర్పించుకొనుచున్నాము. ఇట్లు


ఆశా గ్రంథమాల కార్యాలయము:-
౧౬౪/౧ బి. తూరుప్రబజారు,
హైదరాబాదు-దక్కను, (౧౯౪౧,)

వెల్లూరి మాణిక్యరావు,
కె.వి. గుప్త,
(ప్రకాశకులు.)

# బేతాళ సుల్తానుల భేటీ.



ఈసుల్తానుల కాలము అంతరించిపోయెను. ఆసమయములో సర్దుబాటుచేసుకున్న రాజ్యాలమీద రెసిడెంటులు సవారి అయివుండిరి. ౧౮౪౭ క్రీ॥ శ॥లో ఔధుసుల్తానగు నవాబ్ వాజిదలీఖాన్ అనేవారు మినుకు మినుకుమంటూ రాజ్యం పాలించుతూవుండిరి. ఆతడు పదారణాల మొగలాయి మనిషి. దర్పముకలవాడు. నమ్మినవారికి ఏమిచ్చినా లోపంలేదనేవాడు. కాని నమ్మకంకలవారే ఆయనకు కనిపించకపోయిరి. తనికి భార్యలు లెక్కవేసిచూస్తే ౩౭౫ మంది బేగములుండిరి. తనకు పుట్టినపిల్లలనందరిని లెక్కపెట్టించి పిల్లలపేర్లు, తల్లులపేర్లు వారివారి వయస్సులు, పుట్టినతిథులు ఈవివరాలన్నీ వ్రాయించినాడు. కొనా మొదలు ౫౦౦ మంది ఆడమగసంతానమని నికరంగా తేలింది. ఈసంతానమే ఆయనకు సంతాపహేతువైంది. ఏపెండ్లాం ఏంమందు పెట్టుతుందో, ఎవరెప్పుడు తనను పొడిచిపోతారో, యెవరు తనతక్తును ఆక్రమించుకొంటారో అనే అనుమానాలు ఆయన ఒంటబట్టినవి. నవాబుగారివద్ద గులాములున్నారు. జనానాకాపరులగు హిజ్డాలున్నారు. వినోదాలుకలి

గించే స్తుతిపాఠకులున్నారు. హితవుచెప్పే చిన్నపెద్ద వ న్నారు. అందరిపై నవాబుగారికి అనుమానమే.

"సర్కార్, వాడులేకుంటే ఫలానాగులాంవాన్ని ఫలా బేగం తమకి అపాయంజేసేదానికి ఏ టుచేసిందంట హుజూర్" అని ఒకరుచెప్పేవారు. వాని పీడు వీనిపైనవాడు పితుర్లు చెప్పుతుంటే నవాబుగారికి ఒళ్లం సందేహాలతో తూట్లుపడినట్లు అయింది.

నవాబుసాబ్ గారు మంచము పట్టినారు. అన్నంతె ప్రతితట్టలోని భోజనపదార్థం కొంచెం కొంచెం కుక్కల వేయించి వాటికేమిన్నీ అపాయంలేకుంటే తర్వాత త తినేవాడు. తుదకు నీళ్ళుకూడాయిస్తే యెదుటివారికి సగం తాపి తర్వాత తానుతాగేవాడు. హకీములు హాజరైనార తమకుతోచిన మందులంతాయిచ్చినారు. నవాబుగారి రోగమింకాముదిరింది. తాను పరుండిన గది అమా తముగా తనమీదపడుతుందో యేమో అని కూర్చొ పెట్టును. రాత్రినిద్రపోతే యెవ్వరైనా గొంతుపిసికిపోతారేమొ అని రాత్రంతా జాగరణ చేయడం మొదలుపెట్టినాడు. పగ రాత్రిఅయింది రాత్రిపగలుఅయింది.

నవాబుసాబువద్ద ఒకగులాం "రజా" అనేవాడుండినాడు వానిఅదృష్టమేమోకాని వాడంటేనవాబుకు విశ్వాసం ప్రేమ అపారంగా ఉండేది. ఒకనాడు నవాబుగారు చాందనీ మంచ పైన మూకెడెత్తు మెత్తలమీద శరీరంవాల్చినాడు. నాలుగ బారలపొడవు బెత్తముగొట్టంపై పట్టుజలతారు నగిషీ పనిచేసి

హుక్కాపీకెను నోట్లోపెట్టుకొని గుడగుడాఅనిపీల్చి సుగంధం గోకూడినపొగను విడుస్తూఉన్నాడు. కస్తూరీ, ఖిమాం, జర్దా యింకాయేమేమో సుగంధ ద్రవ్యాలసారంతో నింపిన తెల్లనా కులు పాన్ బీడా నములుతున్నాడు. నోట్లోమొత్రనిరసం ఏండింది మంచంకిందఉండే ఉగల్‌దాను (తమ్మపడిగె) యిటుపట్టుఅను ర్థంవచ్చే సంజ్ఞచేసినాడు. మంచంచుట్టూ ఆశ్రితవర్గంలోఉండే చిల్లరనవాబులు జంగులు, బహాద్దరులు, కూర్చొనిఉండినారు. ఇద్దరు ఆశ్రితులలో కేతడవ ఆఉగల్‌దానును నవాబునోటివద్ద పట్టినారు. వారిలో ఒకడు "కాజిబలీ" ఇంకొకడు ‘అబ్దురహ్మ = ”

తాంబూలరసాన్ని తమ్మపడిగెలో ఉమ్మించి హుక్కా ల్పుచు నవాబుగారిట్లన్నారు. "రజా! నాకింక యీమందులు చాలును. ఈహకీములంతా వ్యర్థులు. ఇంకేదైనా ఉపాయం ఆలోచించురా ఒరేరజా."

"ఖుదావంద్, ఈఖానాజాద్ గులాంమనవిని చిత్తగించాలె. మాస్వామికి యీబీమారివచ్చినప్పటినుండి మాడొక్క కన్నంవుటడంలేదు. కంటికి నిద్రవచ్చేదిలేదు. మాయజమాని బీమారీమార్చుకొనేదానికి అల్లాసెలవిస్తే ఈక్షణం ఈనమ్మక్ హలాల్ గులాం సర్కారు పానంపైన సద్కా అవుతుండే. కాని (చేతులుపిసుకుకుంటూ ఏడ్పుమొగముతో) నేనుమజబూరు ఉన్నాను మాబాప్! అయితే ఒకమాట. సర్కారువారి గ్రహాలేమో వక్రించినట్లున్నవి. ఏజోస్యునికైనా సర్కారువారి జన్మపత్రిక చూపించితే బాగుంటుండెను" అని రజా చెప్పుకున్నాడు.

"ఏదైనా జిన్, పిశాచి, సర్కారుపై ద్వేషంచేసివుండ వచ్చును." అని కాజిబలీఅన్నాడు.

"గులాంవాడైనా రజా మంచిసర్దారు ఆలోచన చెప్పినాడు." అని అబ్దుర్రహిమన్ అన్నాడు.

"అవునే, రజా, నేనుమౌల్వీసాహిద్‌గారికి నాజాతకం ఇదివరకేచూపించినాను. శని గ్రహంబాగాలేదని చెప్పినారు. శాంతిపెట్టించినాను. ఏమిన్నీఫాయిదాలేకపోయింది" అని నవాబువాజదలీ అన్నాడు.

కాజిబలీ—"సర్కార్. తప్పకుండా ఇది జిన్. పరీల దుష్కార్యమే.

అబ్దుర్రహిమాన్ "పూర్వం జహాంగీరు పాషాకు ఇట్లే బీమారి వచ్చింది. హిందూస్థానీ, అరబ్బీ, ఈరానీ హకీములంతా మందులిచ్చిపోరాడినారు. ఏమిన్నీలాభం లేకపోయింది. అప్పుడు ఒకాయన ఇట్లన్నాడు "ఫకీర్లనుపిలిపించి మంత్రించండి అని, అదేప్రకారం చేయించినారు. ఒకఫకీరు మంత్రించి జిన్నలను పారదోలి పాషాను బాగాచేసినాడు."

నవాబు—"అట్లయితే మంచిమంత్రగాన్ని వెతుకండి" రజా అదేపనిగా ఫకీర్లను, మంత్రగాండ్లను వెతికించుటలో చాలాశ్రద్ధవహించినాడు. రెండు మూడు దినాలతర్వాత కాజిబలీ నవాబువద్దసెలవడిగినాడు. "నాఅక్కయొక్క అత్తయొక్క మామఉన్నాడే అతనిచిన్నాయిన్న కొడుకు చాలాబీమారీ అయినాడు. నన్ను వెంటనేరమ్మన్నాడు. రెండునెలల సెలవు ఇప్పించండి" అనినవాబునుకోరి సెలవుపొంది వెళ్లిపోయినాడు.

మరిరెండుదినాలకు అబ్దుల్రహమాన్‌కు ఒక ఆపత్తుసంభవించె ను. ఆయన పెద్దభార్యతల్లిగారి యింటికి నీళ్లాడబోతే అచ్చట ఆమెకు పాముపిల్ల పుట్టిందని వర్తమానంవచ్చింది. ఆపిల్లచావ కుండ ఇంకాబ్రతికేవుందట. "హుజూర్ నేనుచేసుకున్నపాపం ఇట్లాపండింది. పోయిచూచివస్తాను సెలవియ్యవలె" అని అతడు వెళ్లిపోయినాడు. ఇక్కడ రజా ఊరూరికి మనుష్యులపంపి మం త్రవేత్తలైన ఫకీర్లవర్తమానాలు తెప్పించుకుంటూ వచ్చినాడు. అందుకుగాను ౫౦౦౦ రూపాయీలు ఖజానానుండి ఖర్చైనవి. తుదకు వారం దినాలతర్వాత "షాఘామషరీఫ్" అనేఊరునుండి దర్గానజ్జాదాఅయన పావలీ అనేఆయన ఒక జబుబువ్రాసినాడు అందలి విషయంఏమంటే. పాదుషాగారి రోగం సామాన్య మైందికాదు. జిన్ పట్టిందని మావిశ్వాసం. మేమేబాగుచేసుం టిమి. కాని మాగురువుగారగు షాః అబ్దుల్లాగారునాకు సెల వియ్యలేదు. అయినా ఆవృద్ధులు ఈమధ్య మీలక్నోలోనే ఉన్నారు. వారిని ఆశ్రయించండి"

నవాబు వాజదలీఖాన్ దర్బారు జరుగుతూ ఉండింది. నవాబుగారికి సంగీతమంటే చాలాప్రీతి. స్వయంగా ట్రుమ్రీ లలో ప్రవీణుడు. కవులు, గాయకులు, సానులు, మున్నగు వారంతా జతగూడినారు. డోం జాతివాడుగాఉండి నౌముస్లిం అయినగులాం రసూల్ అనేవాడు నృత్యశాస్త్రప్రవీణుడు. భంగీ వాడై నౌముస్లిం అయిన అబ్దుల్లాఅనేవాడు సారంగువాయిం చేవాడు. చమార్ వంశమువాడైయుండిన ఖాసీం తబ్లాలో చం ద్రప్రచండుడు. వీరంతా సభనలంకరించి సంగీతవిద్య ప్రకటించు

చుండిరి- ఆసమయంలో నాదిర్ అలీఅనేవాడు ఇట్లన్నాడు "సర్కార్ కాన్పూరునుండి జోహ్రాజా అనేపేరుగల ప్రసిద్ధురాలైన భోగముది హుజూర్ వారి దర్శనానికివచ్చి బయటి వసారాలో కాచుకొనివున్నది. ఏమిహుకుం!" నవాబుగారు హుక్కాపీల్చినారు. ఒంగారువరఖులతో చుట్టిన పాన్ బీడాను నోట్లోపెట్టుకున్నారు. ఏమో జవాబిచ్చువారై యున్నారు. అంతలో తటాలున రజా హాజరైనాడు. నవాబు భోగందాని ముచ్చట మరిచిపోయెను. క్యారే రజా ఏంవార్త అన్నాడు.

రజా- "ఖుదావంద్ మీతో మనవిచేసియుంటికదా ఫకీరుషా అబ్దుల్లా విషయం. ఆయనను పట్నమంతా గాలించి వెతికించినాను. ఆయన ముఫ్తీగంజులో ఉన్నాడని పత్తా తెలిసింది. అయితే అతడు శతవృద్ధు. గొప్పవలీ. ఎవరినిన్నీ లక్ష్యపెట్టడు. మనం రమ్మంటేరాడు. పొమ్మంటేపోడు. అయనవద్దకు మనమే పోవలసి వుంటుంది.

నవాబు-"అట్లయితే మనమేపోదాం. గురువారంరాత్రి ౧౧ గంటలకుపోదాం. ముందేఫకీరుషాగారికిచెప్పి అంతాఏర్పాటుచేయి.

రజా—"జోహుకుం సర్కార్."

గురువారంనాడు సరిగా ౧౧ గంటలకు, నవాబున్ను రజాయున్ను షాసాబ్ యింటితలుపుతట్టినారు. ఒక ౩౦ ఏండ్ల యువకుడు తలుపుతీసినాడు. "ఫకీరుషా సాబుగారున్నారా" అని రజా అడిగినాడు. "వారుసమాధిలోనున్నారు" అన్నాడు యువకుడు.

రజా- "హుజూర్ నవాబ్ వాజిదలీఖాన్ బహద్దరు సుల్తాన్ జానెఆలంగారు విజయంచేసి ఉన్నారని చెప్పు." యువకుడు గుస్లుమిటకరించినాడు. తత్తరపాటుతో లోపలికురికినాడు. మరికొంతసేపటికి వలీగారిని వెంటబెట్టుకొనివచ్చినాడు. వలీఫకీర్ షాః అబ్దుల్లాకు జేనెడు తెల్లగడ్డం. రాం ఏండ్లుసూచించేవాలకం. కనుబొమ్మలుకూడా నెరిసినవి. గూనివచ్చింది. తెల్లనిబొందెల నిలువుటంగీతొడిగినాడు. మెడలో గోలుగుండ్లంత పచ్చని పూసలదండ వేసుకున్నాడు. ఎడమచేతికర్రపై ఊనినడుస్తు వచ్చినాడు. కుడిచేత తెల్లనిముత్యాలంత తెల్లపూసల(తసిబ్బి)జపమాలతిప్పుతూవచ్చినాడు. నవాబుగారిని తగినగౌరవాలతో ఇంట్లోకి తీసుకొనిపోయినాడు. దీపాలురెండు మినుకుమినుకుమంటూ నవాబుగారి తెలివికి చాటునవ్వునవ్వినట్లుగా వెలుగుతూవుండినవి. నవాబుగారు వలీషాయెదుట మోకాళ్లపై కూర్చున్నారు. "హుజూర్! మీకు కలిగిన అవస్థనంతాగుర్తించినాను. దానికితగిన ఉచ్చాటన ఈరెన్నాళ్ళనుండి చేయుచునేవున్నాను." అనిషాసాబు అన్నాడో లేదో మిద్దెపైభాగాన పిడుగులుపడినట్లు ఉరిమినట్లు దంపుడుపోటు ౧౦మంది ఏకధాటిగా వేసినట్లు ధ్వనులువచ్చినవి. నవాబుగారు తనపైమిద్దె అమాంతముగా పడుచున్నదని నెత్తిపట్టుకొని ఒదిగికూర్చున్నారు. ఇంతలో ప్రక్కగదిలో గొప్పధ్వనులైనవి. యువకుడు దబదబ ఉరుకుతూ షాసాబువద్దకువచ్చి "ఉస్తాద్‌జీ నన్నెవరో మంచంమీదనుండి క్రిందపారవేసి మంచం వెలకిలవేసి నాగదిలోని సామానంతా ధ్వంసంచేసిమాయమైనారు." అన్నాడు. చూ

తాముపదా అనిఅందరును ఆగదికివెళ్ళినారు. గదిలోపగిలిన చీనీసామానులు, చినిగినపుస్తకాలు, తలక్రిందైన మేజులు మంచము, పగిలినపెట్టెలు కనబడినవి. మరలపై భాగంలో ధ్వని అయింది అదే మోచూతాముపదా అనిపైకివెళ్లినారు ఏమిన్నీ లేదు. "ఇదేమిషాసాబ్, అలీఫ్ లైలా కథలాగాఉంది." అన్నాడు. రజా మీరు సూరాపాతెహాచదువండి నేను అమల్ చదువుతాను అన్నాడువలీషా. ముగ్గురున్నూ అంజలిపైకెత్తి మిద్దెవంక మోరలుపెట్టి గాఢముగుభక్తితో మంత్రాలు గొణుగుకొన్నారు. ఒక్కనిమిషములోనే "సలాములేకుం" అనిధ్వని వచ్చింది. అస్సలాములేకుం అన్నాడు షాసాబు. "షాసాబు ఈ నవాబునువెంటనే పంపివేయి నీతో రహస్యముగా మట్లాడేమంది" అన్నదాధ్వని. నవాబు నెత్తివెంట్రుకలు ఇనుపతీగెలవలె సన్నని సూదులవలె నిట్టపొడుచుకున్నవి గుండె దడదడా గోడగడియారంగొట్టినట్లు కొట్టుతూఉంది. శరీరమంతా ఎలెక్ట్రిక్ షాకు తగిలిందాఅన్నట్లు వేధపొందింది. చలికాలంలో భావిలోనూకబడిన కుక్కవలె గజగజవణకిపోయినాడు. కనుగ్రుడ్లు త్రిప్పిత్రిప్పి నాలుగుదిక్కులాచూస్తూ కూర్చున్నాడు. "నవాబుబహదర్ జీ మీరుయింటికిపోండి రేపువర్తమానం నేనేఅంపుతాను" అన్నాడు షాసాబు బ్రతుకుజీవుడాఅని నవాబు లేచి రజాతోకూడ బయటపడి షక్రాంలోఎక్కి దేవిడీబాట పట్టినాడు. ఒకమైలుదూరంపోయ్యేవరకు గుండెస్వస్థానానికి రాలేదు. అప్పుడిట్లన్నాడు "రజా ఈవలీ చాలాఅసాధ్యుడుగా ఉన్నాడు అదంతా ఏంగడిబిడరా నాకు తూర్పుపడమర తోచకపోయింది.

రజా-హుజూర్ ఆధ్వానులంతా అమీరుజ్జిన్నాత్ (బేతా ళుని) యొక్కలీలలు.

నవాబు-“అట్లనా?”

రజా-“సర్కార్, మనగ్రహచారం యింకవదలిపోతుం ది. ఈ వలీఆనుగ్రహంవుంటే అన్నీ సవరణ అవుతుంది.

నవాబు-అరే వేలులక్షలు కావలిస్తే యిచ్చేంగు. ఏమి న్నిలోభంచూపించవద్దు. ఆయనకుకోపంరాకుండా చూచుకో.

రజా—జీహుజూర్.

మర్నాడు షాసాబు శిష్యుడైనయువకుడు (వాని పేరు ముర్తజా) యిట్లురిజాపేర జాబువ్రాసినాడు.

“జనాబెమన్

షాసాబుగారు నిన్న అమీరుజ్జిన్నాత్ యొక్క ప్రథమ భటుని కలిసినారు. అతడే అంతగడబిడచేసిపోయినాడు. జానె ఆలం నవాబుబహద్దరుగారితో మా షాసాబును ఏమిన్నీ జో క్యంకలిగించుకోవద్దని చెప్పినాడు. అయినా మాగురువులవారు వినలేదు. శ్రీనవాబుగారికి పట్టినభూతాన్ని విడిపించవలెనంటే ఈక్రిందివస్తువులు వెంటనేపంపించేది. ఎల్లుండి శుక్ర వారంనాడు మాగురువులవారు ఈపరికరాల నుపయోగిం చుచు మంత్రోచ్చాటనకు కూర్చుందురు.

వస్తువులపట్టీ.

| | | |
|---|---|---|
| గులాబీఅత్తరు తెల్లనిది. | ౧ | సేరు |
| చమేలీ ,, | ౧ | ,, |
| లోభాన్ | ౧౹ | మణుగు |

| | |
|---|---|
| తెల్లని మేకలు | ౭౨ |
| ,, పొట్టేండ్లు | ౭౨ |
| పట్టుబట్టలు | ౧౮౮ థానులు |
| షీరీనీ | ౧। మణుము |
| తెల్లనిజవాహిర్ | ౧ వరుస |
| వెండియిటికెలు | ౧౮౮ |

అన్ని తెల్లని వస్తువులే. భూతాలకు తెలుపే ప్రియం వీటిని ఈనాడేపంపేది."

ఇట్లు,

ముర్తజా.

నవాబుగారు పట్టీని సరిగా చూడనైనాచూడలేదు. "దేదేవ్" అని పట్టీపైసంతకముపెట్టి కోశాధిపతికిపంపినాడు. ఖజానాపెద్ద పట్టీనిచూచి తెల్లబోయినాడు. అన్ని తేవచ్చును కాని తెల్లగులాబీఅత్తరుయెక్కడినుండితెచ్చేది. రజా వానికి సాయపడినాడు. "౫౦౦౦ రూ॥ లుపంపు. నేనే తెప్పించి పంపుతాను. తక్కువపడితే ఇంకాపైకం తెప్పించుకుంటాను." అన్నాడు అట్లే ౫౦౦౦ రూ॥ పంపబడెను.

షాసాబు మంత్రాలు తంత్రాలుచేస్తూ కూర్చున్నాడు. మూడుదినాలైంది. నాల్గవదినం రజాయున్ను నవాబున్ను షాసాబుదర్శనానికి పోయినారు. ఇంకేముంది షాసాబు మూల్గుతూ నిండా ముసుగుపెట్టుకొని మంచంపైపడి ఉన్నాడు. నవాబుకు చాలావిచారంగలిగింది.

రజా–షాసాబ్ క్షేమంగాఉన్నారా?

షా- ఇంకొకక్కడిక్షేమమర్యా జిన్నుల అమీరుయొక్క సేనాని నాపై కోపంవహించి మూడుతావులపొడిచి పోయి నాడు. షావద్దనుండే ముర్తుజాతిన్నగా పచ్చడంతీసి షాసాబు ఒంటిమీదిగాయముల చూపించినాడు.

నవాబు- అరేఅల్లా! అరేఅల్లా! ఇదంతా నామూలాన్నే సంభవించిందికదా. వలీసాబ్ ఫికరు చేయువద్దు. మంచిపేరైన హాకీమునుపంపి బాగుచేయిస్తాను.

అదేప్రకారం దేవిడీకీవచ్చి నగరంలోని ప్రసిద్ధహాకీమును పంపి చికిత్సచేయించినాడు. ౧౦ దినాలకు షాసాబుకుబాగైందని వర్తమానంవచ్చింది. నవాబుగారు చాలాఆనందించి హాకీము కు ౧౦౦౦ రూపాయిలు ఇనామిచ్చినాడు. ముదుసలిషాసాబు ఇప్పుడైనా ఊరకుండగూడదా! మళ్లీ మంత్రప్రయోగాలకు సిద్ధమైనాడు. ఈతడవ అమీరుజిన్నాతును నేరుగాపిలిపించు తానుమూడు నాదెబ్బఅన్నాడు. దానికిన్ని పరికరాలు కావ లెను. మొదటిపట్టీఅంత మూడంతలనరుకులపట్టీ వ్రాయించి పంపినాడు. రజా ౨౫౦౦౦ రూపాయాలు ఖజానానుండి తీసు కొనిపోయినాడు, మరల షాసాబు మూడుదినాలు దీక్షతో కూర్చున్నాడు. తుదకు విజయంపొందినాడు. జిన్ సాక్షాత్తు ప్రసన్నుడైనాడు. నవాబుగారికికూడ ఆనెల అమావాస్యనాడు మధ్యరాత్రి ౧౨ గంటలకు షాసాబుయింట్లో దర్బారుచేసి దర్శనంఇస్తానని షాసాబుకు వాగ్దానమిచ్చినాడు. ఈ వార్త నవాబుగారికి తెలియగానే వారు ఆనంద సంభ్రమాలలో మునిగిపోయినారు. వారందినాలకు ముందుఘండే సన్నాహాలు

ప్రారంభమైనది. జిన్ సామ్రాట్టునెట్లు కలువవలెను. పాదుషా అయినతాను సలామెట్లు పెట్టవలెను. అచ్చట తన స్థానమెద్ది. ఏమేమిమాట్లాడవలెను. ఆయాననుసంతోషపెట్టే మార్గంపది. ఆయనకు ఏమేమినజరానాలియ్యవలెను. ఏమన్నా తక్కువైతే చేసినప్రయత్నమంతా వ్యర్థమవుతుందికదా. శ్రీవారొక్కరే ఆపిశాచనాథునితో కలువవలెనా? లేక వెంటపరివారాలను తీసుకొనిపోవలెనా? ఇట్టిప్రశ్నల పరంపరలకంతా తగిననిర్ణయం దర్బారు అధికారులతో ఆలోచించి నిర్ణయించుకొన్నాడు. తుదకు నిర్ణయంఅయినదేమంటే ఇదివరలోవలెనే కేవలం రజాయున్ను నవాబున్ను పోవలెను. నజరానా నవాబుగారిదర్జాకున్ను పిశాచనాథునిదర్జాకున్ను తగినట్లుగాఉండవలెను. అందుచేత కొన్నిరత్నాలహారాలు, అత్తరు, నాలుగైదుమూర్ల థానులపట్టువస్త్రాలు, ఒక ఖురాన్ షరీఫ్ ఖల్మీపుస్తకం, పెద్దముత్యాల జపమాల మొత్తానికి ౫౦ వేలకుతక్కువగాని కానుకలు స్వయంగా పసందుచేసి తట్టలలోపెట్టించి తాను ౧౨ గంటలకు మాసాబుతోంట హాజరైనాడు.

నవాబుగారు జిన్దర్బారులో దాఖల్ అయినారు. ఆదర్బారు కండ్లకుమిరుమిట్లు కొలుపుతూ ఉండింది. గదిఅంతా దీపాలతో జిగజిగా మెరుస్తూఉంది. అత్తరుసువాసన వూదు పొగ నిండి ఉండింది. పూలహారాలు కుప్పలుకుప్పలుగా పడి ఉన్నవి జిన్ సామ్రాట్టు పెద్దసింహాసనముపై కూర్చున్నాడు. భారీమనిషి, మూరెడుగడ్డం, కండ్లపై ముక్కుపై నల్లనిబట్ట మూతపెట్టినాడు. నెత్తిన పగిడీవంటి కిరీటముంది. నవాబుగారికి జిన్సామ్రాట్టుగారు స్వాగతమిచ్చినారు. ఉభయపార్శ్వాలలో

మోహనాంగులు చామరాలు వీచుచున్నారు. గానము ప్రారంభమైంది. జిన్ సామ్రాట్టు ప్రసన్నుడై ఏం కావాలెఅడుగు ఇచ్చినాను అన్నాడు.

షాసాబు — జానెఆలం మా హుజూర్ షౌధు నవాబు గారికి ప్రాణదానం చెయ్యండి.

జిన్ - ఊం నేననుకున్నాను. నీవిదే అడుగుతావని బిరాదరెమన్! నవాబుసాహెబ్! నీ రోగాన్ని నేనుగుర్తించి నాను. నీవుచేసినంత అనుభవించుచున్నావు.

నవాబు — నేనేంతప్పుచేసినాను సెలవియ్యండి.

జిన్ - ఒకసంవత్సరంక్రిందట జోహ్రాపరీ అనేదిమాలోకం భోగాంగన. అదిమీసంగీతాన్ని మోహించి మీదర్బారుకు వచ్చి దర్శనంఅడిగితే మీరుపలుకకనేపోయినారు.

నవాబు- నాకీసంగతి బొత్తిగాజ్ఞాపకంలేదు. ఎట్లుపొరపాటైందోయేమో. అయినా దానికి పరిహారంలేదా.

జిన్ - ఎందుకులేదు. గోమతీనది అవతలితీరానఉండే షహీదుమర్దుయొక్క గోరీవద్దనుండు రావిచెట్టుపై ఆప్రతి శుక్రవారం ఉండును. అచ్చటికి ౫ మారులు నజరానాపంపించవలెను. ఆమెదాన్ని తీసుకుంటేప్రసన్నురాలైనట్లు నిన్ను ఇంక వదలిపోతుంది అన్నమాట.

నవాబు- ఎంతనజరానా ఇచ్చుకోవాలె.

జిన్ - సుమారు ఒకలక్షరూపాయిలు ఇచ్చుకోవలెను.

నవాబు- చిత్తంఅని సెలవుతీసుకున్నాడు

ఈకార్యకలాపాలన్నీ ముగిసేవరకు ౪ నెలలుపట్టినవి. ౨ లక్షలకుపైగా ఖర్చయినవి.

ఒకనాడు ఆయనప్రియమైనభార్య నవాబుతో ఇట్లన్నది. "నాతోను మీరుకోపపడకుకదా. మిమ్ములను మోసంచేసి రజా గులాంగాడు మీకే మోదయ్యంపట్టిందనీ దాన్నివదలించుటకు ఏమేమో మంత్రాలు చదువాలెఅని చెప్పి అంతావాడున్ను మీ దర్బారివారున్ను మిమ్ముమోసంచేసినారు. తెలిసిందా"

నవాబు- ఛీ ఏంమాట. రజావంటి విశ్వాసపాత్రుడు మరొకడు లేడు:

రెండవదినం ఔధుసంస్థాన రెసిడెంటు అయిన మిస్టర్ వర్డ్ అనువారు నవాబుగారినికలిసి యిట్లన్నారు. మీకుపట్టింది దయ్యంకాదు పిశాచంకాదు. మిమ్ముపట్టినవారు రజాయున్ను కాజబలీయున్ను, అబ్దుర్రహిమానున్ను సాదికలీయున్ను అయి యున్నారు. వారంతాయీ వేషాలువేసిమిమ్ము మోసగించినారు.

నవాబు-కాజబలీ, అబ్దుర్రహిమాన్ సెలవుపైన చాలా కాలం ఉండిరి.

రెసిడెంటు – ఈ వేషాలు వేసేదానికె సెలవు తీసు కొన్నారు. వారితో నీరజాగులాంకూడా కలిసినాడు.

నవాబుగారికి రెసిడెంటుగారిపైనకోపంవచ్చింది- తాను నమ్మినవాడు ద్రోహిఅట. తానుమూర్ఖుడట. ఇదేకదా రెసిడెం టుమాటల అర్థము.

మరునాడు మొత్తం నగరవాసులంతా తనస్వతంత్ర సామర్థ్యాన్ని బాగామాడవలెననే అభిప్రాయంతో నాలుగు గుర్రాల బగ్గీలో రజా గులామును తనప్రక్కన్నే కూర్చోబెట్టు కొని ఔధ్ నవాబుగారు వాహ్యాళివెళ్లినారు.

---

# ర ం భ

---

మహమ్మద్ ఆదిల్ షా బిజాపూరు తుదికాలంలో రాజ్యంచేసినట్టి దక్కనీ సుల్తాను. అతడు క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతంలోని అనగా నేటికి ౩౦౦ ఏండ్ల క్రిందటివాడు.

అతడుచేసిన సాహసకార్యాలను, క్రూర కృత్యాలను, అందరూ మరచిపోయినారు. కాని ఆయన కట్టించిన గోల్ గుంబదుమాత్రం అతన్ని మరచిపోనియ్యకుండా చేస్తూవున్నది. దాని విశేషం ఏమంటే ప్రపంచంలో నెక్కడకూడా దాన్ని మించిన గుంబదులేదు. ౧౨౪ అడుగుల ఆవరణం ౧౭౮ అడుగుల యెత్తు ౧౮౩౩౭ చదరపు అడుగుల వైశాల్యం కలిగిఉంది- చుట్టూ రెండామడల వరకు ఆగుంబదు చూపరులకు కనిపించుతూఉన్నది. ఆగుంబదుక్రిందనే తన యిరువురి భార్యలతో ఆమహమ్మద్ ఆదిల్ షా గోరీలో శాశ్వతనిద్ర చెందియున్నాడు. ఆదిల్షా గోరిప్రక్కనే ఒకచిన్నగోరీయున్నది. దానిలో ఆతని ఉంపుడుకత్తెఅయిన రంభయొక్క భౌతిక శరీరముంచబడినది-

రంభ ఒకసాధారణమైన భోగముది. ఒకనాడు సుల్తానువారిదర్బారులో పాటపాడేదానికివచ్చింది. చూచీచూడడంతోనే సుల్తానుగారికి ఆమెపై ఓర్చుకోరానంత గాఢమగుప్రేమ నాటుకపోయింది. రంభకప్పుడు పదారేండ్లప్రాయము. గులాబీ

వన్నె మనిషి. కోలముఖం. దిట్టమైన శరీరం. నిగ నిగలాడే లావణ్యం. నల్లని కన్నులు. కాటుక అంటించినందున అవి మరీ ఆకర్షణీయమై లోభనీయమై కాటుక పిట్టపిల్లలవలె మిల మిలలాడుతూ వుండినవి. బారడేసి జడ, దాన్ని రెండుపాయ లుగా అల్లి రెండు భుజాలపైనుండి స్తనాలమీదుగా జారవిడి చియుంచింది. ఢాకా పట్టులాగున్న దానిపై జలతారు అంచు లుగల లంగాయున్న కట్టింది. చెవులనిండా రత్నాల పోగులే. కంఠంనిండా ముత్యాల హారాలే. ఆమె యెదిక్కు చూస్తే ఆ దిక్కు సమ్మోహనాస్త్రాలు విడిచిందన్నమాటే. కంఠమాధు ర్యం, హస్తవిన్యాసాలతో కూడినఅభినయం, వహ్వాఅని పాదు షా అనగానే ముసిముసినవ్వులతో అభినయమూ అన్నట్లుగా వినయవిధేయతలతో కొద్దిగానమ్రమై చేయుసలాములు,దర్బా రీ మర్యాదలు, ఇవన్నియు ఈపడుచు ఎట్లా నేర్చిందో యేమో కాని ఆదిల్‌షా దేవిడీ ఆగడియలో జన్నత్‌గా మారింది. పాట ముగిస్తూనే పాదుషా ముక్తసరుగా "తఖ్లియా." అన్నాడు. దర్బార్ బరఖాస్త్. రంభాపరీ పాదుషా గారి జనానాలో దాఖల్.

ఆదిల్షాకు ఇదివరకే ఇద్దరు పట్టపుభార్యలున్నారు. వారి కి యీకొత్తసవతి సహింపరానిదైంది.

ఈ పోరుపడలేక రంభకుగాను ఒకప్రత్యేక ఇంద్రభవన మే కట్టించినాడు. అది యేడంస్తుల మేడ. ప్రతిఅంతస్తులోను నానావిధాలచిత్రాలు అద్దాలు, అందాలుఅమర్చబడినవి. క్రింది అంతస్తులో సుల్తానునూ రంభనూ గచ్చుగోడపై రంగురంగుల

చిత్రాలతో చిత్రించినారు. ఈమేడ పేరు "సాత్ మంజిల్". రంభతో పాదుషా మాసాలను నిముసాలవలె ఆనందంతో గడిపినాడు. ఇట్లా కొన్ని సంవత్సరాలు గడిచినవి. వీరిద్దరూ ఆనందంగా ఉన్న కాలంలోనే పాషా గోల్ గుంబదు కట్టించినాడు. ఎన్నెన్నో మహాలులు కట్టించినాడు. బంగారు సింహాసనాన్ని సిద్ధంచేయించి దానిపై దర్బారుచేసినాడు. ప్రజలుకూడా ఆయనను గౌరవించినారు.

మహమ్మద్ ఆదిల్ షాకు బిజాపూరునగరం విడిచిపోవలసివచ్చింది. తనరాజ్యంలో సంచారంచేసి శత్రువులతో పోరాడి రాజ్యంలో శాంతిస్థాపనచేసి తిరిగి నగరం చేరుకొనేవరకు చాలాకాలం పట్టింది. ఆయన తిరిగి వచ్చేవరకు జనానా లోని సుల్తానాలు (బేగములు) ద్వారపాలకులు, ఆశ్రితులు, మున్నగు వారంతా కలబలుకుకొని రంభపై నేరాలు మోపినారు. "సర్కార్, మాఅధిక ప్రసంగాన్ని క్షమించవలె. బేగంరంభా గారికి సర్కారుపైన పూర్వంవలె ప్రేమలేదు' అని ఒకడు "ఎంతై నాబోగందిబోగము దే. ఖాందానీస్త్రీ ఖాందానీస్త్రీయే. పుట్టిన నాటిగుణం గిట్టిననాడే పొయ్యేది" అని పెద్ద బేగంగారు. "మా ప్రియమైన యజమాని చేపట్టికదా అనైనా తెలివి లేకపోయె దానికి. మా హుజూరెక్కడ. అది సహవాసం చేసిన గులాం మెక్కడ, ఇంతటి అవమానమా!" అని చిన్నభార్య. ఈవిధంగా రంభపైన అందరున్నూ వ్యభిచారదోషం మోపినారు.

పాదుషాకు శరీరమంతయు మండుకొని వచ్చింది. కండ్ల నుండి నిప్పులు కురిసినట్లయింది. నోట మాటకూడ వెడలలేదు.

రంభను సరిగా విచారించనుకూడాలేదు. ఆగ్రహోదగ్రుడైనాడు. రంభ తాను ఏదోష మెరుగననిన్నీ అంతా కల్పనయే అనిన్నీ దీనంగా పరిపరివిధాల మనవి చేసుకొన్నది. కాని పాదుషాకు నమ్మకం కలుగలేదు. అంత గాఢంగా ప్రేమించినదాన్ని చేతులార ఎట్లుచంపవలెను ఇతరులచేత ఎట్లు తల కొట్టించవలెను. పాదుషా తీవ్రంగా ఆలోచించినాడు. రంభను సాత్ మంజిల్ లోని ఏడవఅంతస్తుపై కి తీసుకొనిపోయినాడు. తటాలున ఆమెతో ఇట్లన్నాడు.

"రంభా! నిజంగా నీవు తప్పుచేయకుంటే అల్లా నిన్ను రక్షించుతాడు. తప్పుచేసియుంటివా నీకుఅతడే శిక్ష యిస్తాడు. నీనిర్దోషిత్వాన్ని స్థాపించుకొనేదానికి ఈకిటికీనుండి క్రిందికిదుముకు. తక్షణం దుముకు."

రంభకు కండ్లు గిర్రున తిరిగినై. జీవితంలో తుదిగడియ సమీపించింది. దిక్కులేనిది. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, బంధుజాలం యెవ్వరున్నూ దగ్గరలేరు. దేవుడాఅని కండ్లుమూసుకొని ఒకనిముషం ధ్యానించి కిటికీనుండి క్రిందికి దుమికింది. క్రింద జనం క్రిక్కిరిసిఉన్నారు. పైన పాదుషాఒక్కడే దిగ్భ్రాంతిచేత వ్యసనంతో నిండినవాడై రాతి బొమ్మవలె చూస్తూ నిలుచుండినాడు. కాని దైవమాయ అంటారో మరేమంటారో చెప్పండి. ఈకాలంవారు నమ్మరు. ఆ కాలంవారు దేవుని న్యాయప్రసాదమని నమ్మినారు. రంభ అదృష్టమేమో కాని ఆమె లాగుపైనకట్టుకున్న ౨౦మూరల పట్టుచీర ఛత్రీవలె చుట్టూ తెరుచుకున్నది. దానిమూలాన ఆమె గుండువలెక్రింద

పడకుండా యీకెవలె క్రిందికివచ్చింది. సురక్షితంగా భూమిపై వాలింది. పాదుషాకు పట్టరానిఆనందం కలిగింది. క్రిందిప్రజలు జయజయ ధ్వానములు చేసినారు. కాని అంతలోనే హాహాకారములు చెలరేగెను.

రంభ ప్రశాంత గంభీరదృష్టితో సాత్ మంజిల్ పైభాగములోనున్న ప్రియుణ్ణి చూచింది. కడసారి సెలవుగా చేయి వీసింది. నడుములోఉండిన బంగారుపనిగల జంబియాను లాగింది. ఎదలో పొడుచుకొని క్రింద చచ్చిపడింది. సుల్తాను మూర్ఛపోయినాడు. క్రమంగా తేరుకున్నతర్వాత మొట్టమొదటిపని తన మనస్సును చెడగొట్టి అబద్ధాలు చెప్పినవారిలో భార్యలనుతప్ప తక్కినవారినందరిని తల నరికించినాడు.

ఆనాటినుండి సుల్తాను మారిపోయెను. మహా క్రూరుడైపోయెను. దినమూ తన గుర్రంపట్టే సైసుల తలలను ఎగురమీటి గుర్రంఎక్కేవాడు కంటికందంగా కనపడిన అందకత్తెలను పట్టితెప్పించి చెరిచి రాక్షసానందం పొంది వెళ్ళగొట్టేవాడు.

ఇదంతా కనిపెట్టుతూ ఉండిన మొగలాయి చక్రవర్తి సమయంవచ్చిందని బిజాపూరును ముట్టడివేసినాడు మహమ్మద్ ఆదిల్ షా స్వయంగా తన సేనను ఎదిరించేదానికి నడిపినాడు. కాని లాభం లేకపోయింది. కోట ప్రధానద్వారం ఉల్లిపడింది. ద్వారం వద్దనే సంకులసమరం జరిగింది. ద్వారంనిండుగా పీనుగులు పడి ఉండినవి. ఆపీనుగుల కుప్పలో నోట ఖడ్గంకరచుకొన్న పాదుషాశవం బయటపడింది.

అతడు జీవించిఉండగానే తమప్రియమైన రంభపక్కన్నే తనగోరీనికట్టించి ఉంచియుండినాడు. రంభపక్కన్నే పాదుషా గోరీలో విశ్రమించినదృశ్యం నేటికిని చూడనగును.

భోగముజాతిలో పుట్టిన స్త్రీకూడా ఉత్తమ పతివ్రతలను తలదన్నే ప్రేమను త్యాగమును నిరూపించగలదని రంభ తన జీవితవిధానంచేత ప్రపంచానికి చాటించింది.



# చస్తానంటే పురసత్తు లేదు.



మొగలాయి చక్రవర్తి జహాంగీరు పాదుషా ఢిల్లీలో రాజ్యంచేస్తుండంగాను వారొకనాడు నగరములో వాహ్యాళికై అంబారీ ఏనుగుమీద వెళ్ళినారు. ఆ కాలంలో చక్రవర్తులు ఎన్నోమాసాల కొకమారు బయటికి వచ్చేవారు. అందుచేత ప్రజలంతా వీధులనిండా గుంపులుగుంపులుగాచేరి సర్కారువారి దర్శనార్థము గంటలకొలది నిరీక్షిస్తూవుండేవారు. పాదుషాగారు బయటికివెళ్ళినారంటే వేలకొలదిరూపాయల సంచులు ప్రక్కన ఉంచుకొని వెళ్ళేవారు. బాజారు పొడుగునా ఆచేతా యీచేతా పిడికిళ్ళకొద్దీ రూపాయలవర్షము కురిపించేవారు. పాదుషా ముందుకుసాగితే వారివెనుకదిక్కు బీదవారంతా ముష్టియుద్ధ ప్రారంభించేవారు. ఎవరు బలాఢ్యులో వారికే రూపాయలు దొరికేవి. ఈలాగా వారు వెళ్ళుచుండగా వకచోట ఫకీర్లకుచల్లిన రూపాయిలకై మేలైన ముష్టియుద్ధం జరుగుతూ ఉండింది. ఇట్లందరూ యుద్ధముచేస్తూ వుండగా ఒక మూలన నిమ్మళంగా ముగ్గురుమనుష్యులు కూర్చొని ఉండినారు. బట్టలు పేలికలుపేలికలుగా చినిగినవి. ఒళ్ళంతయు దుమ్ముతోనిండింది. ఈగలుజుమ్మని వారిచుట్టునూ మునురుకొనియుండినవి. వాటిని వారు జోపుకోనైనాజోపుకోరు. కాలుకేలు కాస్తకూడకదలించరు. నల్లమందుతిన్నవారివలెవున్నారు. ఆత్మసమాధినిష్ఠలో ఉన్న మూర్తిత్రయంవలెఉన్నారు. చక్రవర్తి వస్తూఉన్నాడనే సంభ్ర

మంకూడా లేదు. తలయెత్తైనా చూడరు. చక్రవర్తి దృష్టి వారి పైన బడింది. ఆయనకేమిముచ్చటైందో యేమో ఏనుగును వారిముందట నిలుపమన్నాడు. రెండుమూడు నిముషాలు అక్కే నిలచినాడు. జనులంతా అముగ్గురిమూర్తులదిక్కే చూస్తూ ఏం జరుగనున్నదో యేమోఅని ఆశ్చర్యపడుచున్నారు. కాని ఆ ముగ్గురుమూర్తుల కాగొవడ యేమిన్ని కాబట్టలేదు. పాదుషా కాదుకదా పాదుషానుపుట్టించిన అల్లాకూడ వారిముందు వచ్చి నిలిస్తే పలుకరించేలక్షణం కనిపించలేదు. తుదకు పాదుషాగారే వారిని పలుకరించినాడు. జవాబులేదు గివాబులేదు. "ఏమి మీ కథ? యింతప్రశాంతంగా వున్నారు" అనిఅడిగినారు. "మాజూర్" (అశక్తత) అన్నాడు అందులో వకడు మాత్రము చాలా ముక్తసరుగా. తక్కినయిద్దరు పలుకనేలేదు. తుదకు తలైనా యెత్తిచూడలేదు. ఎంతమరిపోతులోకదా వీరుఅని ఆశ్చర్యం కలిగింది పాదుషాకు. వారిని వెంటరమ్మన్నాడు. "చేతకాదు" అన్నాడు ఒకడు. ఊహూఁ అన్నాడు ఇంకొకడు. వారిని నడిపించుకొని తనవెనుక తీసుకొనిరావల్సింది అని పాదుషా జవానుల కాజ్ఞాపించినాడు. "నీవేనడుపు మాబదులు" అని మూడవవాడు ఇంతసేపటికి నోరుతెరిచి ముత్యాలురాల్చినట్టుగా పలికినాడు. వీరు దినానికి వక్కమాటకూడా వ్యర్థంగా ఖర్చుచేసేవారుకానట్లు రుజువుచేసుకొన్నారు. జవానులు కొంతదూరం వీరిని జరజర యీడ్చినారు. శరీరము చెక్కలుపోయినాసరే వారు నడిచేలట్లు లేదు. తుదకు వారని ఒకబండిలో వేసినారు. హుజూరుగారు దేవిడీచేరిన తర్వాత యీమనష్యులకు ఒక మంచి ఇల్లు ఖాళీ

చేయించినారు. అందు వీరికి సకలము సిద్ధముచేయించి పెట్టించి నారు. పైగా వకచాటింపుచేయించినారు. ఈనగరములో సోమరిపోతులైనవారందరున్నూ యీబంగ్లాలోవచ్చి నివాసం చేయవచ్చును అని. ఇంతమాత్రం అవకాశము కలిగితే యింకేమి చెప్పవలెను. ఒక వారములోపల ౧౦ వేలమంది ఆ బంగ్లాలో జతకూడినారు. వజీరెఆజం (ప్రధాన మంత్రి) గారికి పాదుషావారి విపరీతమైనఆజ్ఞ ఏమిన్నీ నచ్చలేదు. ఇట్లైతే నగరంలోని జనులంతా ఒక నెల ప ప్రూటలలో సర్కారీ ఖజానాను తిండిక్రిందికే ఖర్చుపెట్టిస్తే ఇంకెట్లా అని హుజూరుగారితో మనవి చేసుకొన్నారు. "అయితే యేమి వుపాయం" అన్నారు సర్కారు. ఇంతమందిలో నిజమైన సోమరులెవరో వారికే మీఫర్మానువర్తిస్తుందికాని దొంగసోమరులకు కాదు కదాఅని మనవి చేసుకొన్నాడు. "వజీరుసాహెబ్ అయితేమెట్లాగుర్తుపట్టవలె నిజమైనసోమరులను" అన్నారుసర్కారువారు. ఆపని నేనుచేసి తమకు తెలుపుకొందును అని లేచి వెళ్ళినారు మంత్రిగారు. మరునాడే సోమర్ల బంగ్లాచుట్టును గడ్డివాములు పెట్టించి నాలుగుదిక్కులలోను మనుష్యులు వచ్చిపోవుటకు మాత్రము దారివిడిచి వాములను అంటుపెట్టించినారు. అగ్ని జ్వాలలు బంగ్లానుచుట్టుకొన్నవి. వచ్చిన సోమరిపోతులంతా గబగబా గుంపులుగుంపులుగా బయటికివచ్చి బ్రతుకుజీవుడా అని పారిపోయినారు. అగ్ని బంగ్లాలో ప్రవేశించింది. ఇంక బంగ్లాలో ఎవరున్ను లేరుకదాఅని వజీరుగారు అగ్నిని వెంటనే ఆర్పించినారు. పాదుషాగారిని పిలుచుకవచ్చి వారితోకూడ

బంగ్లాలో ప్రవేశించి గది గదీ పరీక్షించినారు. వకగదిలో మన ముగ్గురుఫకీర్లు మాత్రము యథాప్రకారం కూర్చొని వున్నారు. వారిలో ఇట్లు ముక్తసరుగా సంభాషణ జరుగుతూ వుండింది.

ఒకరు—"ఎందుకో చాలా వుష్ణంగావుందిరానేడు.

౨ వ వాడు — "ఎందుకోరా నాకూ కొంచెం కాక తగుల్తూ వున్నట్లుంది.

3 వ వాడు—(తనపై ఈగలనైనా జోపక) "ఓరేయ్! మీకేమొచ్చిందిరా తెగులు. ఎందుకరుస్తారు అదేపనిగా. కాస్తనిమ్మళంగా నన్ను వుండనియ్యకూడదూ!

జహాంగీరుచక్రవర్తి వారి సంభాషణను విని నిర్ఘాంతపోయినారు. తుదకు పాదుషాగారు యిట్లాసెలవిచ్చినారు.

"అరే! మీకు జీవనముపై ప్రీతిగాని ఆశగానిలేనట్లుంది. ఇట్టి బ్రదుకు బ్రతికేదానికన్న చావకూడదాయేమి"

అంటే వకడిట్లా కొంచెము తలయెత్తి కూర్చున్నచోటినుండే ధీమాగా జవాబిచ్చినాడు.

"చావాలనంటే ఎంతప్రయత్నం కావలెనో నీకు తెలుసునా మరి. ఆపని తొందరగాయేమన్నా అవుతుందా. అంతపరిశ్రమకు మేమువోపుకుంటామా. మాకు చస్తామంటే పురుసతు లేదు"

———

# ఫకీరు బిడ్డ



అది జహాంగీరు చక్రవర్తి జమానా. ఢిల్లీలో ఇద్దరు నవాబులుండిరి. వారి బేగముల పేర్లు ఫర్ఖుందా బేగం, హామీదా బేగం. ఆయిద్దరికి మంచి స్నేహం కుదిరింది. ఫర్ఖుందాకు ఒకే కొడుకు. హామీదాకు ఒకే బిడ్డ. ఒకనాడు వారిట్లు మాట్లాడుకున్నారు. "ఏమే అక్కా! నాకు ఒకే పిల్లవాడు. నీకూ ఒకే కూతురు. ఇద్దరికి ఈడూ జోడూ బాగా కుదిరింది. మన స్నేహం భాంధవ్యంగా మారి వెయ్యేండ్ల పంటపండించే యేర్పాటు యెందుకు చేయకూడదే!" ఇద్దరు సరే అంటే సరే యనుకున్నారు.

ఇట్లా కొన్ని యేండ్లు గడచినవి. హామీదా మొగుడు కాలంచేసినాడు. నవాబుల సంపదంతా యధికారం ఉన్నంత కాలమే వుండేది. మగడున్నన్ని దినాలు హామీదాకు ౧౦ మంది "మామాలు" అనగా "ఆడపాపలు" ౧౮ నౌకర్లు. బగ్గీలు, మ్యానాలు, గుర్రాలు, సిపాయీలు, దినమూ పొలావు, బిర్యాని, ఖైమా వంటలు, ఇట్లాంటివాటి కేమిన్నీ కొదువ లేదు. మగడుచచ్చిన కొన్ని మాసాలకే హామీదాకు దరిద్ర దశ ప్రాప్తించింది. నౌకర్లంతా పోయిరి. మ్యానాలు,గీనాలు వడ్డీలక్రింది కేమాయం. గుర్రాలు గిర్రాలు అన్నీ అప్పుల

వాండ్లవశం. బంగ్లా అమ్మింది, సొమ్ములమ్మింది. తుదకు బట్టలుకూడా అమ్మింది. వేరేమొహల్లా (బజారు) లో గుడిసెలో నివాసంచేసింది.

ఇక్కడ పరుఖుందా ఐశ్వర్యం ఇంకా హెచ్చుతూ వుండింది. నవ్వాబు సల్లగావున్నంతకాలము ఆమెకేమిపర్వా? ఒకనాటి మిట్టమధ్యాహ్నముఎండకాలములో జనానా మహాలు చుట్టు వట్టివేళ్ళతడకలు నీటితో తడుపుతున్నారు. పంఖాలను దాసీలు లాగుతున్నారు. ఇద్దరు ఆడవాపలు కాళ్ళొత్తుచున్నారు. ఒకతె హుక్కా అందిస్తున్నది. ఒక దాసి పాందాన్ వద్దపెట్టుకొని కస్తూరి, జరదా, కాచు, ఏలకులు మున్నగు సుగంధద్రవ్యములచేర్చి పాన్‌బీడాలు చుట్టియిస్తూ వున్నది. ఒక లౌండీ ఉగల్‌దాన్ పట్టుకొని నిలుచున్నవి. అట్టి స్థితిలో నౌకర్లను ప్రక్కకునూకుతూ మైలబుర్ఖా వేసుకున్న వక స్త్రీ పర్ఖుందా పర్ఖుందా అంటూ కేకలువేస్తూ మహాలులో ప్రవేశించింది. ఆమెచీర చినిగినది. కాళ్ళలో చినిగిన మోజాలు లటపటమంటూ మొరటుగా ధ్వనిస్తూ వున్నవి. వేషము చూస్తే ఒక పేద భికారిఅని తెలుస్తూనేవున్నది. పరుఖుందాకు పట్టరానికోపంవచ్చింది. నౌకర్లపై కండ్లురుముతుంది. అట్టి భికారీవాండ్లను లోపలికెట్లారానిస్తిరి అని గర్జిస్తూ వున్నది. "చెలీ! దాసీలదేమీ తప్పులేదే, నేనే వారినిప్రక్కకు తోసుకుంటూవచ్చినాను." అన్నదిఆభికారి. "చెల్లీ!ఎవతివేనీవు పెద్దక్కవు ఎక్కడినుండి దాపరించితివే! బజారిముండవునీవేడ! నేనేడ! మంచిచుట్టరికమే! పోతవాలేదా?" అనికసరుకొన్నది

పర్మిందా. "ఏమేహమీదాను గుర్తుపట్టలేదా?" అన్నదాబీద రాలు. "హమీదా! హమీదా! నీవేనాయీలాంటి వేషము లోవచ్చింది. అయితే ఎందుకువచ్చినావు?"

"నీకోడలు పెద్దపిల్లఅయినది నీఅమానత్ సామ్మ నీకప్ప చెప్పి పోదామనివస్తిని"

"నాకూ—కోడలూ — ఫకీరుముండబిడ్డనాకు కోడలా! ఛీ! బుద్ధిలేదుపో!తక్షణం వెళ్లిపో! యింకో సారి యీలాంటిమాట లంటివా నీపండ్లూడుతవి ఖబర్ దార్."

"ఏమమ్మా, అంతకోపమా!ఆనాడుమనమిద్దరము రంగు మహాల్ లో కూర్చుని సరసాలాడుకుంటువుంటే నీవేకదా నీబిడ్డ ను నాకొడుక్కియ్యవమ్మా అని చేతిలో చేయి వేయించుకొని ప్రమాణంచేయిస్తివి. ఇంతలోయింతమరుపా."

"ఛీ,ఛీ, అంతారఘూటా! నాకేమిపిచ్చిపట్టిందా. అమీ ర్జాదీలంతాచచ్చిపోయినారా? నాకొడుకేమి కొజ్జా అనుకొన్నా వా? నీవంటి గరీబంబూవమ్మల బిడ్డలను ప్రార్థించేదానికి."

"అయితే నాబిడ్డనింకెవరికన్నా ఇచ్చుకొమ్మంటవా"

"దానికినాసెలవెందుకు! తక్షణమే ఇచ్చుకోవమ్మా! కష్టపడికనుక్కున్నావు. నీకిష్టమున్న ఫకీరుకిచ్చుకో. ఇంక యిక్కడినుండిమర్యాదగాదయచేయండి. నిన్నుచూస్తేనాకుతల నొప్పిలేస్తుంది."

* * * *

ఒకనాటి అర్ధరాత్రిసంగతి. వీధులు నిర్జనంగాఉన్నవి. ఒకసందు చుట్టూబయలు. అందువకగుడిసె ఒకఫకీరుఅల్లా పేరున "ఒకకబళంతల్లీ" యనిధ్వనించెను. గుడిసెనుండిహామీదా

బయటికివచ్చి "భాయీ! నేను,నాబిడ్డ, పగలంతా రోజా వున్నాము. మాకేకూటికిలేదు నాయనా. మాఫ్ చెయ్యండి" అనిఅన్నది గుడిసెలోనిబూవమ్మ. "అయితేఅమ్మా! నాజోలె లోవుండేది ముగ్గురంపంచుకొని తిందాము" అన్నాడుఫకీరు.

ఫకీరులోపలికివెళ్లి కూర్చున్నాడు. జోలెలోనిఅన్నము, రొట్టె బయటికితీసినాడు. ముగ్గురుతినినారు. అటుతర్వాత హామీదా యిట్లన్నది.

"దుర్వేష్! మీరుచాలామంచివారు. మీకు మేముసహాయము చేయవలసియుండెను. మాకేమీరువుపకారంచేస్తిరి. ఈ దరిద్రులు మీకేమిసేవచేయగలరు.అయినాయీనాబిడ్డ మీకు కాళ్ళొత్తును. దినమంతా తిరిగితిరిగి మి కుకాళ్లునొప్పిపట్టి వుండును." అని హామీదా అన్నది.

ఫకీరుకాళ్లుచాచినాడు. హామీదాబిడ్డ తనచల్లనిమృదు హస్తాలతో భక్తియుక్తంగా అతనికాళ్లువత్తింది. తెల్లవార వచ్చింది. పకీరులేచిపోతూ మళ్లీరేపువస్తాను. మీకుపగటిభోజనానికి నావద్దయింకా రొట్టెవున్నది. దాన్నితినండి అంటూ ఇంకొకజోలెనుండిరొట్టెతీసి యిచ్చిపోయినాడు.

పగలుముఖముకడుక్కొని రొట్టెతిందామని తల్లిబిడ్డలు కూర్చొని రొట్టెనువిరిచేవరకు ఒకఅష్రఫీ ఘుణమంటూ క్రింద పడింది. తల్లిబిడ్డలు ఆశ్చర్యంతో వకరివంక ఒకరుచూచుకున్నారు. మళ్లీరాత్రికి ఫకీరువచ్చినాడు. మళ్లీవారికి అన్నము పెట్టినాడు. తానూతినినాడు. బిడ్డకాళ్లువత్తింది. మళ్లీపొయ్యే అప్పుడు పగటిభోజనానికని ఒకరొట్టె యిచ్చిపోయినాడు.

ఇట్లా పదకొండు సంవత్సరకాలమైంది. హమీదాయింట్లో అప్రఫీలకుప్ప పెరుగుతూవచ్చింది. గుడిసెపోయిపెద్దయిల్లైంది. ఇప్పుడు మంచి గుడ్డలు మంచిభోజనము దొరుకుతూవుంది.

అక్కడ పర్షుందా మొగుడు చచ్చిపోయినాడు. కొన్నా ళ్లలోనే పరుందా దివాలాతీసింది. ఐశ్వర్యమంతా పోయింది. దానితోగూడ గర్వము,అంధత్వము రెండూదూరమైనవి.హమీ దాజ్ఞాపకంవచ్చింది. యిపుడామెతన నచాలసుఖంగా వున్నది ఒకనాడు హమీదా యింటికివచ్చి

"నీబిడ్డను నాకొడుక్కియ్యవూ? నీవాయిదా ప్రకారము జల్దీయిచ్చి పెండ్లిచేయవలె" అన్నది.

"తల్లీ! యిప్పుడునా బిడ్డపై నాకేమిన్ని అధికారంలేదు. నీవే చెప్పితివికదూ ఫకీర్ చుట్టరకం చేయమని. నీమాటప్రకారమే నాబిడ్డయిప్పుడు ఒక ఫకీరుబిడ్డగావున్నది. ఆయనయిష్టంయెట్లుం టే అట్లేజరుగుతుంది"

"అయితే ఆఫకీరెవ్వరు?"

"ఎవరోనమ్మా! నేనుజూడలేదు. నాబిడ్డాచూడలేదూ. చీకట్లోవస్తాడు మాయిద్దరికడుపునిండా అన్నముపెడ్తాడు. మళ్లీ చీకట్లోనే వెళ్లిపోతాడు"

"ఎంతటి మాయలాడివే! కానీలేచూస్తాను" అని పర్షుం దా మొగము చిట్లించుకుంటూ వెళ్లిపోయింది-

* * * *

జహాంగీరు చక్రవర్తి ఆస్థానము. విశాలమైన దర్బారు. చోబ్దార్లు బారులు తీర్చినిలిచినారు. ఇరుప్రక్కల నవాబులు, రాజాలు, అమీర్లు ఎవ్వరిదర్జాప్రకారము వారుకూర్చున్నారు.

పర్ధుందా దావాపత్రము దాఖలుచేసుకొన్నది. పాదుషాతల యూపి తక్షణం హమీదాను ఆమెబిడ్డను మాదర్బారునకు పట్టుకొనిరమ్మని ఆజ్ఞాపించినాడు. హమీదా జవాబుదాఖలు చెసుకున్నది. తనబిడ్డను ఐశ్వర్యములో వుండేకాలములో ప ర్ధుందా చేసుకొనని చెప్పిందనియు, యిప్పుడు ఒకఫకీరు తనను, తనబిడ్డనూసాకుతూ వున్నందున ఆయనయిష్టం యెట్లావుంటే అట్లేకాని తనదేమీలేదనిన్నీ మనవిచేసుకొన్నది. అయితే ఫకీరెక్కడనున్నాడు" అన్నారు పాదుషాగారు.

"అదేమో నాకు తెలియదు.

"ఆయన ఎట్లావుంటాడు.

"అదికూడా తెలియదు.

"నీబిడ్డకైన తెలుసునా అదీ తెలియదా?

"నాబిడ్డను విచారించండి.

హమీదాబిడ్డ ముందుకువచ్చి ఇట్లన్నది.

"సర్కార్ పుర్‌నూర్ పాదుషాసలామత్. నేను ఆఫ కీరుగారి ముఖము ఎన్నడునూ చూడలేదు. ఒకఏడాదిగాఆయ నకాళ్లువత్తినాను. లక్షమందిఫకీర్లలో ఆయనపిక్కలుచూస్తే చాలు గుర్తించుకోగలను." అని మనివిచేసుకొనెను. సరే అన్నాడుచక్రవర్తి: పట్నంలోవుండే ఫకీర్లనందరిని హాజరు చేయమన్నాడు- గాజుపూసలవారు, టెంకాయచిప్పవారు, మూరెడుగడ్డమువారు, లోభాలే పాగవారు, నానావిధాలఫకీర్లు వచ్చినారు. హమీదాబిడ్డ అందరిపిక్కలను పరీక్షించింది- "వీరిలోనాతండ్రి ఎందునులేడు" అనిఅన్నది. తర్వాతతన దర్బా

# రుమాలను బఱ్ఱె తినిపోయింది.



మొగలాయి పాదుషాలకాలంలో జడ్జిపనిచేసేవారంతా ఖాజీలే. విశేషముగా షరేషరీఫు ప్రకారమే ఖాజీలు అమలుచేస్తూవుండేవారు. చాలామట్టుకు ఖాజీపదవికి మూడు అంశములు ప్రధానంగా ఉండేవి. ఖురానేషరీఫ్ కంఠపాఠము రావలెను. మూరెడు కాకున్నను జానెడుగడ్డము ఉండవలెను. తలపాగ ఉండవలెను. ఖాజీసాబ్ పురుసతువుండే సమయంలో కచ్చేరీ. హుక్కా, పాన్దాన్, వుగల్దాన్ పంఖావాలా, ఖురానేషరీఫు, తెల్లనిమస్లిన్ గోల్దిండు, చోబ్దార్లు ఇవికచ్చేరి పరికరాలు. వాది ప్రతివాదుల దరఖాస్తులే యావత్తు మిసళ్లు. ఫైసలా అప్పుడే సునాయించేది- కొందరి ఖాజీలకచ్చేరీలలో ఎక్కువలంచము ఎవరిదైతే వారిదే న్యాయం. అందరు యిట్లావుంటారని కాదు. కాని కొంతమంది యిట్టివాండ్లే అని ఆచరిత్రకారులకేమి దుర్బుద్ధిపుట్టిందో వ్రాసినారు. ఇక మనకథా నాయకుడైన ఖాజీకథవినండి.

ఒకనాడు లంజమిండల పంచాయితి వచ్చింది. ఉంచుకొన్నవాడు దాన్నిరోసి వెళ్లగొట్టినాడు- "అయ్యా! యీముట్లుడిగినబాన్నెను ఎవరమగుతాను. నాపిల్లలకెవరు దిక్కు" అని అన్నది వాది. ప్రతివాది యిట్లన్నాడు- "దీన్ని నేనుంచుకొన

ను- ఇదివ్యభిచారి, పదిలోపదకొండో వాన్ని నేను. నేనుదీన్ని
రించేజిమ్మేదారికాను" వాయిదా వేసినాడు ఖాజి. అదిమతల
తో వేసిన వాయిదా. వాయిదాలోపుగా ప్రతివాది ఉం
వాళ్ల ఘాకాపస్లూతీసుకొనిపోయి మర్యాదగా ఖాజీసాబుకు
ంటిలోనజరానా సమర్పించినాడు- వాయిదానాడు ఖాజీసా
ప్పన్నాడు- "ఏయ్! ఛినాల్? నీవుఇజ్జత్ దార్ల ఇజ్జత్ తీసేదానికి
చ్చేరీకి వచ్చినావు-ప్రతివాదిచాలాపెద్దమనిషిలాగా వున్నాడు-
వు యెంతమందినోపోయినదానవు లేకుంటేనీవు యింతకాల
ు పెండ్లిలేక యెట్లాపిలల్కనినావుచెప్పు! నీకుహత్కడీ వేయిం
పూర్లోజులూస్ చేయిస్తా ఖబర్దార్"

వాదికూడకొంచెము తెలివిగలమనిషి. ఇంత ఎకాయెకీ
ాజీసాబ్ పట్టాయించినదానికేమోమంచికారణ ముంటుందని
గ్రహించి యిట్లా మనవిచేసుకున్నది- "ఖాజీసాబ్! సర్కార్!
ాకు వక పేషీదయచేయవాలా! మళ్లీ పేషీలోపల నేనుతమకు
సందయ్యే అట్టిమంచి సుబూత్ ఇస్తా" ఖాజీసాబు గడ్డము
వ్వుకుంటూ మతలబుగ్రహించి, "అచ్ఛాయుంమవారము పేషీ!
చ్చేరీబరఖాస్తు" అన్నాడు- మర్నాడు ప్రొద్దుననే యీవాది
యిన స్త్రీ ఖాజీసాబింటికి నెలదినాలక్రిందనే యీనిన మంచి
ర్రైను దానిదూడను తోలుకొనిపోయి యింటిముందర కట్టి
వేసింది"క్యాహై," అన్నాడు ఖాజీసాబ్-

ఆమె— ఏమీలేదు ఖాజీసాబ్! ఇదియెండకాలము.
పాడియెక్కడచూచినా తక్కువగాఉన్నది- నీకుయింటినిండ
పిల్లలు పాపము! పసికూనలకు పాలులేకుంటేయెట్లు? యీబర్రె

పూటకునాలుగుసేర్లు పక్కాసేర్లు పాలిస్తుంది- బాగుంటుంది. ఉంచుకోండి అన్నది- ఖాజీసాబ్ సంతోషముపట్టలేక పోయినాడు- బొహత్ అచ్ఛా అన్నాడు. ఆమెతిన్నగా ఇట్లాఅన్నది. “సర్కార్ నాపంచాయతీలో అనుగ్రహం చెయ్యాలె.” ఓ! అది నాకుబాగాగుర్తువున్నదిపో. అన్నాడు ఖాజీ-

పేషీనాడు ఖాజీసాబ్ ప్రతివాదిని జూచియిట్లన్నాడు. అరేనమ్మక్ హారామ్! సువ్వర్! నీకుమందీపిల్లల్కి వుంచుకొనిపిల్లలకీ పుట్టించేదాన్కి వస్తాది. వాండ్లకీపోషణ చెయ్యాలా అంటే కష్టంవుందీక్యా! నీవుకేన్కి తచ్చణంతీస్కాపోయియింట్లోవుంచుకొని మున్పటిలాగసాకు. లేక్పోతే నెలకీ భరణార్థము కిందికి ౨౦రూపాయీలు యిస్తూవుండు తెల్సిందా? యిదేమాద్ఫైస్లా!

ప్రతివాది నోరుతెరుచుకొని నెత్తినగొట్టినట్లు నిర్ఘాంత పోయిచూస్తూనిలబడినాడు. తుదకు తెలివితెచ్చుకొని ఖాజీసాబ్ తన నజర్ మరిచిపోయినాడేమో జ్ఞాపకముచేస్తామని, “సర్కార్ ఛాకామస్లికిరూమాలఉయ్యాల్లది.” ఇట్లావాడు అంటూవుండగానే ఖాజీసాబు మాటఅందుకొని యిట్లన్నాడు “ఓ! నీరుమాలను బత్తాతిసేసింది! జావ్.”



గోలకొండముద్రాక్షరశాల, హైద్రాబాదు.